ఓం నమో కాళీకృష్ణ భగవాన్.





# లక్షవర్తివ్రతకల్పము

తాత్పర్య సహితము.


మా ప్రపితామహులు * శతాధిక వైదిక గ్రంథకర్త :

**కీ. శే. చల్లా లక్ష్మీనృసింహ శాస్త్రిగారు**





వ్యవస్థాపకులు :

కీ॥ శే॥ మా పితామహులు చల్లా నాగేశ్వర శాస్త్రిగారు

పబ్లిషర్సు :

**చల్లా నాగేశ్వర శాస్త్రి**

శ్రీ ఆర్యానంద ముద్రాక్షరశాల

బందరు - బచ్చుపేట - 521 001





**1995** వెల రు. **5-00**

ఓం నమో కాళీకృష్ణభగవాన్

శ్రీ గురుభ్యోనమః హరిః ఓమ్

# లక్షవర్తివ్రతకల్పము

[ఉద్యాపన ప్రకరణము.]

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనంధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥ ....సర్వేభ్యో మహాజనేభ్యో నమః ॥ ఆచమ్య ॥ ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ ........ మమాచరిత వ్రతకల్పోక్త సంపూర్ణ సకలఫలావాప్త్యర్థన రజస్సంపర్కేష్టకృతవ్యభిచారాది రహస్య పాపనివృత్త్యర్థం ప్రకాశకృత సమస్త దోషపరిహారార్థం ధర్మాజి....ర్థం శ్రీలక్ష్మీనారాయణదేవతాముద్దిశ్య ....ప్రీత్యర్థం లక్షవర్తి వ్రతోద్యాపనాఖ్యం కర్మకరిష్యమాణ స్తదంగత్వేన తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాంత్యర్థమభ్యుదయార్థంచ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనంకరిష్యే ॥ [ఇతిసంకల్ప్య] ఆదౌనిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణపతిపూజాంకరిష్యే ॥ తతఃగణాధిపతిపూజాం పుణ్యాహవాచనంకృత్వా ॥ అథప్రదేశే గోమయేనానులిప్య రంగవల్యాదిభిరలంకృత్య । తదుపరి పీఠంనిక్షిప్య । తదుపరిఅష్టదళపద్మంలిఖిత్వా॥ తత్రశ్వేతవస్త్రంద్వయం పరిస్తీర్య। తదుపరిపంచప్రస్థపరిమిత తండులానిక్షిప్య తన్మధ్యే అష్టదళపద్మం లిఖిత్వా తత్రతామ్రనిర్మిత ప్రధానకలశంనిధాయ। తత్కలశే పంచపల్లవానినారికేళంచనిక్షిప్య । నూతనవస్త్రమావేష్ట్య । తత్కలశే గంగాజలం పూరయిత్వా। మంటపస్య ఈశాన్యమారభ్యప్రాగాదిక్రమేణత్వయస్త్రింశత్కలశాన్ సప్రతిమాన్ సవస్త్రాన్నిధాయ । మంటపస్య దక్షిణభాగే కనకవర్తి సహిత కాంసపాత్రే లక్షవర్తి దీపారాధనంకుర్యాత్। తత్రగోఘృతం నిధాయ ॥ కాంస్యపాత్రాభావే మృణ్మయపాత్రే దీపారాధనం కేచిత్కుర్వంతి ॥ [అత్రసంకల్ప్యః] ఏవంగుణ.... శుభతిథౌ మమేహజన్మని జన్మాంతరేషుచ సంజాత సమస్తపాపక్షయార్థం విశేషణ అస్మిన్జన్మని ప్రథమార్తవదిన మారభ్య ఏతావత్పర్యంతం ఋతుకాలిక శాస్త్రీయ

యుషః లోపేన అజ్ఞానతో రజస్వలా నోన్య స్పర్శాదిదోషేణచ సంపాదిత
మహాపాపనివృత్త్యర్థం కామతో నిషిద్ధకాల కృతమైథునాదిదోష ప్రా
యశ్చిత్తార్థం కాయికవాచిక మానసిక కాన్యతను వ్యభిచారపురుష స్త్రీ
సంభాషణాది ప్రాయశ్చిత్తార్థం పాతివ్రత్య ధర్మలోప ప్రాయశ్చిత్తార్థం
శరీరారోగ్యసిద్ధ్యర్థం సమస్తదోషపరిహారార్థం శ్రీ లక్ష్మీనారాయణ
ప్రీత్యర్థం స్కాందపురాణ కల్పోక్తప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానా
వాహనాది షోడశోపచారపూజాం కరిష్యే ॥ ఆదౌ లక్షవర్తి దీపారాధ
నం కరిష్యే ॥ మంత్రః ॥ ఓమ్ ॥ ఉద్దీప్యస్వ జాతవేదోఽపఘ్నన్నిర్
ఋతిం మమ । పశూగ్ంశ్చ మహ్యం మావాహ జీవనంచ దిశో దిశ ॥
జ్యోతిష్మతీం త్వాసాదయామి .... సర్వస్మైస్వాహా ॥ ప్రజామ్య ॥ మంట
పస్యోత్తరదిగ్భాగే వంశపాత్రయుగ్మం నిధాయ ॥ పునఃసంకల్ప్యం ॥
ఏవంగుణ....శుభతిథౌ....శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం లక్షవర్తివ్ర
తోద్యాపనాంగ ప్రతిమా శోధనాదికం కరిష్యే॥ శ్లో॥ దధసర్పిర్మధుక్షీ
రైః శర్కరేణ ఫలైస్సహ । ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శో
ధయేత్తతః ॥ మంత్రః ॥ ఆప్యాయస్వ సమేతు తే విశ్వత సోమవృష్ణి
యమ్ । భవా వాజస్య సంగథే ॥ దధిక్రాన్ణో అకారిసం జిష్ణోరశ
స్య వాజినః । సురభినో ముఖాకరత్ప్రణఆయూగ్ంషి తారిషత్ ॥ శుక్ర
మసి జ్యోతి రసి తేజోఽసిదేవో న స్సవితో త్పునా త్వచ్ఛిద్రేణ
పవిత్రేణ వసోసూర్యస్య రస్మిభిః ॥ మధువాతా ఋతాయతే మధు
క్షరంతి సింధవః । మాధ్వీర్న స్సంతోష్వధీః । మధునక్తముతో
షస్సిమధుమ త్పార్థివగ్ం రజః । మధుద్యౌరస్తునః పితా ॥ మధు
మాన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తుసూర్యః । మాధ్వీర్గావో భ
వంతునః ॥ తాశ్శర్కరాఽభవన్ । త్వచ్ఛర్కరాణాగ్ం శర్క
రత్వమ్ । వజ్రోవై శర్కరాః । పశురగ్నింపరిమిణోతివజ్రేణై వాస్మై
పశూన్పరిగృహ్ణాతి । తస్మాద్వజ్రేణ పశవః పరిగృహీతా స్తస్మాత్
స్థేయావ స్థేయసో నోపహరతే త్రిసప్తాభిః పశూకామస్య । ఓం ఆపో
హిష్ఠామయోభువః । తాన ఊర్జేదధాతన । మహేరణాయచక్షసే ।
యోవశ్శివతమోరసః । తస్యభాజయతేహనః। ఉశతీరివమాతరః।తస్మా
అరంగమామవః । యస్యక్షయాయజిన్వథ । ఆపో జనయథాచనః॥ ఇతి

పంచామృతేన శుద్ధోదకేనచ ప్రక్షాళ్య ॥ ఆదౌ గణపతిమావాహ్య॥
శ్లో॥ ఉత్తమాంగణనాథస్య పూజాసతసాంకరీశుభా ॥ భక్తాభీష్ట ప్రదా
తస్మాత్ ధ్యాయేత్తం విఘ్ననాయకమ్॥ మంత్రః॥ ఓం గణానాం త్వా
....వాదనమ్॥ గణాధిపతయే....మి॥ అథ పీఠపూజాంకరిష్యే॥ ప్రాగ్ద్వా
రే-ద్వారశ్రియైనమః। ధాత్రేనమః। విధాత్రేనమః॥ దక్షిణద్వారే
ద్వారశ్రియైనమః చండాయనమః। ప్రచండాయనమః ॥ పశ్చిమ
ద్వారే ద్వారశ్రియైనమః। జయాయనమః। విజయాయనమః। ఉత్తర
ద్వారే ద్వారశ్రియైనమః। బలాయనమః । ప్రజాయనమః । మధ్యే
చిచ్ఛక్త్యైనమః । సత్వాయనమః । రజసేనమః । తమసేనమః । పత్రే
భ్యోనమః । దిశేభ్యోనమః । కేసరేభ్యోనమః । తన్మధ్యేకర్ణికాయైనమః
తన్మధ్యేదశకళాత్మనే వహ్నిమండలాయనమః వహ్నిమండలాధిపతయే
బ్రహ్మణేనమః । తన్మధ్యే ద్వాదశకళాత్మనే సూర్యమండలాయనమః
సూర్యమండలాధిపతయే విష్ణవేనమః । తన్మధ్యే షోడశకళాత్మనే
చంద్రాయనమః । చంద్రమండలాధిపతయే సర్వేశ్వరాయనమః తన్మ
ధ్యేస్వర్ణమంటపాయనమః । తన్మధ్యేసహస్రదళపద్మాయనమః ।
తన్మధ్యే కల్పవృక్షాయనమః తన్మూలె నవరత్నఖచిత సింహాసనాయ
నమః । అథతప్రియ స్త్రీంశతకలశవస్త్రోపరి పృథక్పృథక్ సప్రతిమా
నావాహ్య ॥ శ్లో॥ ఆగచ్ఛదేవదేవేశ లక్ష్మ్యాసహజనార్దన। ఇమాంమ
యాకృతాంపూజాం గృహాణ సురపూజిత। మంత్రః। ఓమ్॥ నారా
యణాయవిద్మహే వాసుదేవాయధీమహి॥ తన్నోవిష్ణుఃప్రచోదయాత్।
శ్రీలక్ష్మీనారాయణ మావాహయామి స్థాపయామి పూజయామి ॥
తతః బ్రహ్మమంటపే బ్రహ్మకలశమావాహ్య॥ శ్లో। బ్రహ్మాణం రక్త
గౌరాంగం చతుర్వక్త్రం జగత్ప్రభుం । అక్షసూత్రకుండీకాభీతి వర
పాణి విచింతయే॥ మంత్రః॥ బ్రహ్మదేవానాంపదవీః కవీనామృషిర్వి
ప్రాణాం మహిషో మృగాణామ్। శ్యేనో గృధ్రాణాగ్ స్వధితిర్వనా
నాగం సోమఃపవిత్ర మత్యేతి రేభన్ ॥ బ్రహ్మాణం॥ సాంగం....మి॥
అథ ఇంద్రాద్యష్టదిక్పాలకా నావాహ్య ॥ శ్లో॥ ఇంద్రో౽మరావతీ
నాథః శచీదేవ్యాస్తునాయకః। వజ్రాయుధశ్చప్రాచీశః తస్యైరావ
తోగజ ॥?

మంత్రః ॥ ఓమ్ ॥ ఇంద్రంవో విశ్వతస్పరి.... కేవలః ॥ ఇంద్రంలోకపాలక మావాహయామి స్థాపయామి పూజయామి ॥ శ్లో॥ అగ్నిస్తేజోవతీవాసీ స్వాహా దేవ్యాః ప్రియపతిః । మేషారూఢశ్శక్తిధరః దిశ్యాగ్నేయ్యాం ప్రతిష్ఠితః ॥ మంత్రః॥ ఓమ్॥ అగ్నిదూతం వృణీమహే.... సుక్రతుమ్ అగ్నింలోకపాలకమా....మి ॥ శ్లో॥ యమస్సంయమనీనాథః ॥ శ్యామలా యామనఃప్రియః । దండభృన్మహిషారూఢో దక్షిణస్యాందిశిస్థితః॥ మంత్రః ॥ ఓమ్ ॥ యమాయసోమగ్ం.... అరంకృతః ॥ యమం లోకపాలక మా....మి ॥ శ్లో॥ కృష్ణాంగనాపురం యస్య దీర్ఘాభార్యావరోహయః॥ శస్త్రకుంతో నిరృతిశ్చ నైరృత్యాందిశి సంస్థితః ॥ మం ॥ ఓమ్ మాషు ణఃపరా తృష్ణయాసహ ॥ నిరృతింలోకపాలకమా....మి॥ శ్లో॥ పురీశ వద్గావతీయస్య ప్రియభార్యాచ కాళికా । చక్రివాహః పాశధరో వరుణః రుక్చమేశ్వరః॥ మం॥ ఓమ్॥ ఇమంమేవరుణ ....చకే। వరుణంలోకపా.... మి ॥ శ్లో॥ వాయురంధవతీనాథః కించతస్యాంజనాప్రియా । సారంగవా హోధ్వజభృత్ వాయువ్యాందిశివర్తతేమం ॥ ఓమ్ తవవాయువృ.... వృణీమహే ॥ వాయులోక....మి ॥ శ్లో॥ కుబేరస్చాలకాయాంతు చిత్ర రేఖాప్రియాంగనా। హయోవాహనిఖడ్గధరఃఉదీచ్యాందిశివర్తతే మం॥ ఓంసోమోధేనుగ్ం....దస్మై ॥ కుబేరంలోకపాలక....మి॥ శ్లో॥ యశో వతీశ ఈశానః పార్వతీపరమేశ్వరః । ఈశాన్యాందిశి సంభాతివృషా రూఢ త్రిశూలభృత్ ॥ మం॥ ఓం తమీశాన జగత....స్వస్తయే ॥ ఈశానంలోకపా....మి॥ శ్లో॥ ఉత్తుంగ వృషభారూఢం పద్మపత్రాయ తేక్షణం । క్షేత్రపాలమహంవందే సర్వారిష్టస్యశాంతయే ॥ మం॥ ఓం క్షేత్రస్యపతినావయగ్ం....దృశే క్షేత్రపాలకమా....మి॥ శ్లో॥ అభీష్ట మభయం శీఘ్రం మనసా చింతయన్నపి । పూజయే త్సర్వకార్యేషు గృహేచ జయసిద్ధయే ॥ మం॥ ఓం యతఇంద్రభయామహే ॥ జహే ॥ అభయంకరమా....మి॥ శ్లో॥ ఊర్ధ్వస్థితం మహాకాయం అంతరిక్షే మరుం త్పథే । పూజయేద్భక్తియుక్తంచ మనోగతివిధాయినమ్॥ మం॥ ఓం ఊర్ధ్వఊషుణ....మహే। ఊర్ధ్వాపురుషమా... మి॥ శ్లో॥ చిత్రవరాం ధరాం సౌమ్యాం సర్వసస్యాలయాం శుభాం । చింతయేద్భక్తమా

వ్రక్తబలయుక్తం కరాంబుజామ్ ॥ మం ॥ ఓం స్యోనాపృథివీ.... థాః ॥ పృథివీమా.... మి ॥ శ్లో॥ మానదండంకరాబ్జేనవహంతం భూమిశోధకం। వన్దేహంవాస్తుపురుషంశయానం శయనేశుభే॥ మం ఓం వాస్తోష్పతే ప్రతిజా.... దే ॥ వాస్తుపురుషమా.... మి ॥ శ్లో॥ గరుత్మద్వాహన రూఢం శంఖచక్రధరం హరంపీతాంబరంహృదింధ్యాయేత్సర్వాభీష్టస్య సిద్ధయే ఓం ఇదంవిష్ణు.... సురే ॥ శ్రీవిష్ణుమా.... మి ॥ శ్లో॥ క్షీరాబ్ధిపుత్రికా దేవి సర్వదేవసంపూజితే। చతుర్భుజాం గృహ్యతాం దేవిసుస్థిరేకమలాసనేం మం॥ ఓంసక్తుమివతిత.... వాచి॥ లక్ష్మీమా.... మి॥ శ్లో॥ జ్వాలామాలా పరివృతంమహ్నిమండలమధ్యగం। ధ్యాయేత్కఖాదశయుతం శక్తిధారి ణమీశ్వరమ్॥ మం॥ కద్రుద్రాయప్రచేతసే.... హృదే రుద్ర.... మి ॥ శ్లో॥ గౌరీంసువర్ణ వర్ణాభాం స్వర్ణపద్మ సునాసీనీం । పాశాంకుశధరాం ప్రీతి ధరాంచ శివవల్లభామ్॥ మం॥ ఓం గౌరీః మాయ.... వ్యోమన్॥ గౌరీమా.... మి ॥ శ్లో॥ అచ్యుతః కల్పవృక్షశ్చ అనంతః కామధేనవః చింతామణిస్తు గోవిందో నామత్రియ ముదాహృతమ్ ॥ అచ్యుతాయ నమః, అనన్తాయనమః గోవిందాయనమః। ఆవాహయామి స్థాపయామి పూజయామి॥ తత్సర్వోపచారైః ॥ ప్రపూజయేత్ ॥ ఆచమ్య.... శ్రీలక్ష్మీ నారాయణప్రీత్యర్థం షోడశోపచారపూజాంకరిష్యే ॥ తదంగకలశారా ధనంకరిష్యే ॥ శ్లో॥ కలశస్యముఖేవిష్ణుః ....శ్రితాః॥ మం॥ ఓం ఆకలశేషు ధావతే॥ శ్లో॥ గంగేచయమునేకృష్ణే గోదావరి సరస్వతి। నర్మదే సిన్ధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు ॥ అయాంతు శ్రీలక్ష్మీనారాయణ దేవతా పూజార్థం మమ దురితక్షయకారకాః । కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య। దేవమాత్మానంచ సంప్రోక్ష్య ॥ అథ ప్రాణప్రతిష్ఠాపనం కుర్యాత్ ॥ మం॥ ఓం అసునీతేపునరస్మాసు.... ముపహ్వతే॥ స్థిరోభవ వరదోభవ। సుముఖోభవ సుప్రసన్నోభవ। స్థిరాసనంకురు॥ అథధ్యానం। శ్లో॥ సహస్రార్కప్రతీకాశంపద్మపత్రవిభేషణం। కోటికందర్పలావణ్యా దివ్యమాల్యాంబరావృతం ॥ లక్ష్మీసమేతం దేవేశంపీతకౌశేయవాససం॥ స్మితవక్త్రముదారాంగంధ్యాయేల్లక్ష్మీపతింహరిమ్॥ శ్రీలక్ష్మీనారాయ ణాపరబ్రహ్మణే నమః॥ధ్యానంసమర్పయామి॥ శ్లో॥ఆవాహయేజగన్నాథం

లక్ష్మ్యా సహ జగత్పతే। యావత్త్వాం పూజయిష్యామి తావత్త్వం సుస్థిరో భవ॥ శ్రీ....ఆవాహనం స....మి॥ శ్లో॥ సింహాసనం మహద్దివ్యం హేమ రత్న సమన్వితం। మయాని వేదితం తుభ్యం గృహాణ జగతః ప్రభో॥ శ్రీ... సింహాసనం....మి॥ శ్లో॥ పాద్యం గృహాణ దేవేశ గంధపుష్పాక్షతైర్యుతం॥ కరుణాకర దేవేశ గంగాజలమిదం ప్రభో॥ పాద్యం....మి॥ శ్లో॥ అష్టద్రవ్య సమాయుక్తం స్వర్ణపాత్రస్థితం జలం గృహాణ దేవ సర్వజ్ఞ సర్వదేవ నమస్కృత॥ అర్ఘ్యం....మి॥ శ్లో॥ దేవదేవ జగన్నాథ పురాణపురుషోత్తమ మయా దత్తమిదం తోయం గృహాణాచమనం ప్రభో॥ ఆచమనీయం....మి॥ శ్లో॥ గోక్షీర దధిసంయుక్తం శర్కరా మధుసంయుతం। గృహాణ దేవ సర్వజ్ఞ సర్వగీర్వాణసేవిత॥ మధుపర్కం....మి॥ శ్లో॥ పంచామృతైః। కురు స్నానం వేదమంత్రైస్సుసంయుతం। గృహాణ దేవ సర్వజ్ఞ లక్ష్మ్యా సహ జనార్దన॥ పంచామృతస్నానం....మి॥ శ్లో॥ నదీనాం చైవ సర్వాసామానీతం నిర్మలోదకం స్నానం స్వీకురు దేవేశ మయా దత్తం సురేశ్వర॥ శుద్ధోదకస్నానం....మి॥ శ్లో॥ వస్త్రయుగ్మం మయా దత్తం సుసూక్ష్మం స్వర్ణనిర్మితం। గృహాణ దేవదేవేశ సర్వవేదాంతగోచర। వస్త్రయుగ్మం....మి॥ శ్లో॥ సువర్ణతంతుభిర్యుక్తం బ్రహ్మణా నిర్మితం పురా। ఆయుష్యవర్ధనం దివ్యం దదామి సురనాయక॥ యజ్ఞోపవీతం....మి॥ శ్లో॥ శ్రీగంధం చందనోన్మిశ్రం కర్పూరేణ సంయుతం। విలేపనం సురశ్రేష్ఠ తవప్రీత్యై దదామ్యహమ్॥ శ్రీగంధం....మి॥ శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దేవ శాలియాన్ తండులాన్ శుభాన్। హరిద్రామిశ్రితాన్ తుభ్యం గృహాణ సురసంహార॥ అక్షతాన్....మి॥ శ్లో॥ కరవీరైర్జాతికుసుమైశ్చంపకైర్వకుళైశ్శుభైః। శతపత్రైశ్చ కల్హారైరర్చయే త్వాం పురుషోత్తమం॥ పుష్పం....మి

అథాంగపూజా। చంచలాయ నమః పాదౌ పూజయామి॥ చపలాయ నమః। గుల్ఫౌ పూజయామి। ఘుపాష్టేణ నమః। పాపిణం పూజయామి। సుదీర్ఘాయ నమః జంఘే పూజయామి॥ రంభోరవే నమః। ఊరూ పూజయామి। పురుషోత్తమాయ నమః। కటిం పూజయామి। పద్మనాభాయ నమః। నాభిం పూజయామి। సుపక్షసే నమః। వక్షస్థలం పూజయామి। దీర్ఘబాహవే నమః। బాహూన్ పూజయామి। సుకంఠాయ నమః। కంఠం పూజ

యామి । కేశవాయనమః । ముఖంపూజయామి ॥ సువాసికాయనమః వాసికాంపూజయామి ॥ నీలోత్పలదళశ్యామాయనమః । నేత్రేపూజయామి ॥ నారసింహాయనమః । శిరఃపూజయామి ॥ సర్వేశ్వరాయనమః సర్వాణ్యంగానిపూజయామి । ఇంద్రాయ నమః। అగ్నయేనమః । యమాయనమః। నిరృతయేనమః। వరుణాయనమః। వాయవేనమః । కుబేరాయనమః ॥ ఈశానాయనమః ॥ ఓం కేశవాయనమః....శ్రీకృష్ణాయనమః ॥

---

## అథ విష్ణ్వష్టోత్తర శతనామ పూజా.

ఓమ్ విష్ణవేనమః
లక్ష్మీపతయేనమః
కృష్ణాయనమః
వైకుంఠాయనమః
గరుడధ్వజాయనమః
పరబ్రహ్మణేనమః
జగన్నాథాయనమః
వాసుదేవాయనమః
త్రివిక్రమాయనమః
దైత్యాంతకాయనమః
మధురిపవేనమః
తార్క్ష్యవాహాయనమః
సనాతనాయనమః
నారాయణాయనమః
పద్మనాభాయనమః
హృషీకేశాయనమః
సుధాప్రదాయనమః
మాధవాయనమః
పుండరీకాక్షాయనమః
స్థితికర్త్రేనమః
పరాత్పరాయనమః
వనమాలినేనమః
యజ్ఞరూపాయనమః
చక్రపాణయేనమః
గదాధరాయనమః
ఉపేంద్రాయనమః
కేశవాయనమః
హరిణాయనమః
సముద్రమథనాయనమః
హరయేనమః
గోవిందాయనమః
బ్రహ్మజనకాయనమః
కైలభాసురమర్దనాయనమః
శ్రీధరాయనమ
కామజనకాయనమః
శేషశాయినేనమః
చతుర్భుజాయనమః
పాంచజన్యధరాయనమః

శ్రీమతేనమః
శార్ఙ్గపాణయేనమః
జనార్ధనాయనమః
పీతాంబరధరాయనమః
దేనాయనమః
సూర్యచంద్రలోచనాయనమః
మత్స్యరూపాయనమః
కూర్మతనవేనమః
క్రోడరూపాయనమః
నృకేసరిణేనమః
వామనాయనమః
భార్గవాయనమః
రామాయనమః
హాలినేనమః
కలికినేనమః
హయాసనాయనమః
విశ్వంభరాయనమః
శింశుమారాయనమః
శ్రీకరాయనమః
కపిలాయనమః
ధ్రువాయనమః
దత్తాత్రేయాయనమః
అచ్యుతాయనమః
అనంతాయనమః
ముకుందాయనమః
దధివాహనాయనమః
ధన్వంతరయేనమః
శ్రీనివాసాయనమః

ప్రద్యుమ్నాయనమః
పురుషోత్తమాయనమః
శ్రీవత్సకౌస్తుభధరాయనమః
మురారాతయేనమః
అధోక్షజాయనమః
ఋషభాయనమః
మోహినీరూపధరాయనమః
సంకర్షణాయనమః
పృథవేనమః
క్షీరాబ్ధిశాయినేనమః
భూతాత్మనేనమః
అనిరుద్ధాయనమః
భక్తవత్సలాయ నమః
నరాయనమః
గజేంద్రవరదాయనమః
త్రిధామ్నేనమః
భూతభవనాయనమః
శ్వేతద్వీపసువాస్తవ్యాయనమః
సూర్యమండలమధ్యగాయనమః
సనకాదిమునిధ్యేయాయనమః
భగవతేనమః
శంకరప్రియాయనమః
నీళాకాంతాయనమః
ధరాకాంతాయనమః
వేదాత్మనేనమః
బాదరాయణాయనమః
భాగీరథీజన్మభూమిపాదపద్మాయ [నమః]
సంతాప్రభవేనమః

స్వభవేనమః
ఘనశ్యామాయనమః
జగత్కారణాయనమః
అవ్యయాయనమః
బుద్ధావతారాయనమః
శాంతాత్మనేనమః
లీలామానుషవిగ్రహాయనమ
దామోదరాయనమః
విరాణ్మూర్తాయనమః
భూతభవ్యభవత్ప్రభవేనమః
ఆదిదేవాయనమః
దేవదేవాయనమః
ప్రహ్లాదపరిపాలకాయనమః
ఇతివిష్ణ్వష్టోత్తర శతనామపూజాం సమర్పయామి.

[అథ విష్ణుసహస్రపూజాంకరిష్యే ॥ ఇతిసంకల్ప్య ॥ విష్ణుసహస్రనామపూజాం కుర్యాత్ ॥ ]

ఇతి విష్ణ్వష్టోత్తర శతనామపూజా సమాప్తః.

శ్లో॥ దశాంగంగుగ్గులూపేతం సుగంధంచమనోహరం । ధూపం గృహాణదేవేశ సర్వదేవనమస్కృత॥ ధూపమాఘ్రాపయామి॥శ్లో॥ ఘృవర్తిసమాయుక్తం వహ్నినాయోజితం ప్రియం । అజ్ఞాననాశనం దేవ గృహాణ శ్రీమనోహర ॥ దీపందర్శయామి ॥ ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి ॥ శ్లో॥ రాజాన్నం సూపసంయుక్త శాంచోష్యసమన్వితం । ఘృతభక్ష్యసమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥ మహానైవేద్యం సమర్పయామి ॥ శ్లో॥ అమూనిఫలవర్యాణి సంపూర్ణరసవంతిచ। స్థాపితానిపురోభాగే గృహాణజగతః ప్రభో॥ నానావిధ ఫలహారాణి సమర్పయామి ॥ శుద్ధాచమనీయం సమర్పయామి ॥ శ్లో॥ పూగీఫలైస్సకర్పూరై ర్నాగవల్లిదళైర్యుతం। ముక్తాచూర్ణసమాయుక్తం తాంబూలంస్వీకురుప్రభో ॥ తాంబూలంసమర్పయామి॥ తాంబూలచర్వణానంతరం శుద్ధాచమనీయం స....మి॥ శ్లో॥నీరాజనంగృహాణేదంపంచవర్తిసమన్వితం। తేజోరాసిమయందత్తం గృహాణత్వం సురేశ్వర ॥ నీరాజనంసమర్పయామి ॥ నీరాజనానంతరంశు....మి ॥శ్లో॥ ప్రదక్షిణంకరిష్యామి సర్వభయనివారణం । సంసారసాగరాన్మాంత్వ ముద్ధరస్వమహాప్రభో ప్రదక్షిణనమస్కారాన్ స....మి ॥ శ్లో॥ మంత్ర

హీనం క్రియాహీనం భ_క్తిహీనంజనార్దన। యత్పూజితంమయాదేవ పరిపూర్ణంతదస్తుతే ॥ అనయాధ్యానావాహనాది షోడశోపచారపూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీలక్ష్మీనారాయణస్సుప్రీతోవరదోభవతు॥ ఆచరితవ్రతకల్పో_క్త....రస్తు॥ ఆచమ్య....ప్రీత్యర్థం లక్షవ_ర్తివ్రతోద్యాపనాంగత్వేన అర్ఘ్యప్రదానానికరిష్యే॥ శ్లో॥ సహస్రాక్షసహస్రాశాయ సహస్రశిరసే నమః। ఇదమర్ఘ్యం మయాదత్తం సంగృహాణజనార్దన॥ శ్రీలక్ష్మీనారాయణాయనమః॥ ఇదమర్ఘ్యం సమర్పయామి ॥ ఏవంద్వాదశార్ఘ్యాని దద్యాత్ ॥ అనేన....భవతు॥ శ్లో॥ త్రివిక్రమాయ దేవాయ వాసుదేవాయ విష్ణవే। సర్వవ్రత ఫలాధ్యక్ష వ్రతో_క్తఫలదోభవ । ఇతి క్షమార్పణమ్॥ ఇతి పూజావిధానం సంపూర్ణమ్ ॥

---

గణేశాయ నమః.

అథ కథా ప్రారంభః.

శ్లో॥ వ్యాసం వసిష్ఠ నప్తారం శ_క్తేః పౌత్రమకల్మషమ్ । పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే। నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయనమోనమః। సుపుణ్యేనైమిశారణ్యే నానాద్రుమలతాయుతే ॥ తత్రస్థితా మహాభాగాః పుణ్యాబ్రహ్మర్షిసత్తమాః ॥

తా॥ మిక్కిలి పవిత్రమైనదియు, అనేక వృక్షములతోడను, తీగెలతోడను కూడుకొన్నదియునగు నైమిశమను ప్రసిద్ధికెక్కిన యరణ్యమందు మహామభావులును పుణ్యాత్ములును నగు శౌనకాదిమహామునులు నివసించియుండిరి.

శ్లో॥ ఆగతంచ మహాభాగం వేదశాస్త్రార్థకోవిదం వ్యాసశిష్యం పురాణజ్ఞం పూజయిత్వా యథావిధి । ఊచుః ప్రాంజలయ స్సర్వే॥ తపసాద్యోతితప్రభాః ॥

తా॥ తపస్సుచేత ప్రకాశింప జేయఁబడిన తేజస్సు కలిగినట్టు వంటి యా శౌనకాదిమహామునులు తమయాశ్రమమునకు వచ్చినట్టు వంటివాఁడును, వేదశాస్త్రములయొక్క యర్థములను బాగుగా తెలిసి

కొన్నటువంటివాఁడును, అష్టాదశపురాణములను తెలిసినటువంటివాఁడు నగు వ్యాసమహర్షికి శిష్యుఁడయినటువంటి సూతుని శాస్త్రప్రకారముగ పూజించి బద్ధాంజలులై ఒకవాక్యమును పలికిరి.

ఋషయః ఊచుః ॥శ్లో॥ నారీణాం గోప్యపాపానాం రజస్సంపర్కజానిచ । తాసాంముక్తిప్రదంగుహ్యం వ్రతంబ్రూహి మహామతే॥

ఓ సూతుఁడా! లోకమందు రహస్యమైన పాపములుగల స్త్రీలకు రజస్సంపర్కమువలనఁ గలుగు పాపము లనేకములు కలవు; ఆస్త్రీలు అ పాపమువలన విముక్తులయి ముక్తిపొందుటకు తగినట్టిదియును, రహస్యమైనట్టిదియును నగువ్రతమేదయిన నున్నయెడల దానిని మాకొఱకు చెప్పుము,

సూతఉవాచ ॥శ్లో॥ సాధుపృష్ట మహాభాగాయన్మాంపృచ్ఛథ సాదరం । తదిదానీంప్రవక్ష్యామి శృణుధ్వం మునిపుంగవాః ॥

తా॥ ఓమునులారా! మీరడిగినప్రశ్న మిక్కిలిమంచిది. మీరు నన్ను దేనినిగురించి అడిగితిరో దానిని చెప్పుచున్నాను వినుఁడు,

శ్లో॥ పురాకైలాసశిఖరే హేమప్రాసాద సత్తమే । రత్నసింహాసనాసీనం శంభుం శాశ్వత మవ్యయం। పార్వతీ భక్తిసంయుక్తాం ఇదంవచనమబ్రవీత్ ॥

తా॥ పూర్వము కైలాసపర్వతమందు సువర్ణరూపమైన మేడమీఁద రత్నఖచితమగు సింహాసనమందు కూర్చున్నటువంటి వాఁడును, శాశ్వతుఁడయినటువంటివాఁడు నగు సాంబమూర్తినిజూచి పార్వతీదేవి మిక్కిలిభక్తితోఁ గూడుకొన్నదగుచు యీచెప్పబోవు ప్రకారము ఒక వాక్యము పలికెను.

పార్వత్యువాచ ॥శ్లో॥ దేవదేవ జగన్నాథ నమస్తే కరుణాకర । నమస్తేఽస్తు సురాధ్యక్ష మయివాత్సల్యమస్తిచేత్ ॥ నారీణాంగోప్యపాపానాం పాపాని వివిధానిచ । పరవాసాదిజంపాపం ? ర్తృవిష్ఠురభాషణాత్ । భ్రూణహత్యాదిజంపాపం గర్భభేదాదీజంతథా। పరమర్త్యాదికామార్థం రజస్సంకరజంతథా । అసత్యవచనాత్పాపం నానావిషయ

కామనాత్ । పతిశ్వశురవాక్యానామనాదరణవంతథా పతివంచన సం పాప మన్యద్బహువిధంభజేత్ ॥

తా॥ సమస్తదేవతలకు దేవుఁడయినటువంటి వాఁడవును, సమస్త లోకములకుప్రభువై నటువంటివాఁడవును, కరుణకునంస్కారభూతుఁడయి నటునంటివాఁడును, సమస్తదేవతలకు దయామయుఁడై నటునఁటివాఁడవు నగు నోసాంబమూర్తీ! నాయందు మీకుదయయున్న యెడల చెప్పుడు లోకమందు రహస్యకృతమైన పాపముఁగల స్త్రీలయొక్క పాపములనేక విధములుగానున్నవి. స్త్రీలకు పరగృహమందు నివసించి యుండుట వలన కలిగిన పాపమును, భర్తతోడ కఠినముగా మాట్లాడుటవలన కలిగిన పాపమును, శిశుహత్యచేత కలిగిన పాపమును, గర్భస్రావము చేత కలిగిన పాపమును, పరపురుషుని కోరుటవలన కలిగినపాపమును వాకిటనుండి అన్నివస్తువులు స్పృశించిన పాపమును, అబద్ధమాడిన పాపమును, నానావిధములగు భోగములను కోరుటవలన కలిగిన పాప మును పెనిమిటిని అత్తమామలను అమర్యాదచేసినపాపమును, పెని మిటిని వంచనచేసిన పాపమును, యితరములగు అనేకవిధములయిన పాపములు కలిగియున్నవి.

శ్లో॥ సుందరంపురుషందృష్ట్వా భ్రాతరాం పితరంతథాః యోని ర్ద్రవతినారీణాం తేజస్స్ఫూర్యాత్ ఘృతంయథా ॥

తా॥ సౌందర్యవంతుఁడగు పురుషునిఁగానిఁ, తోడబుట్టినవానిని గాని, తండ్రినిగాని చూచినయెడల స్త్రీలయొక్క యోనిఅగ్ని స్పర్శచే నేయివలెనే ద్రవించుచుండును.

శ్లో॥ గర్భవిచ్ఛేకరణాత్ పఙ్క్తిభేదా త్తథైవచ। పాకవిప్రి యతః పాకద్రవ్యస్యాపహారాత్తథా ॥ పాపాని వివిధాన్యాపాం సంతి లోకేమహామతే । తస్మాత్తాసాంగతిర్నాస్తికథం ముక్తిర్భవిష్యతి ॥

తా॥ ఓ సాంబమూర్తీ! గర్భవిచ్ఛేదము చేయుటచేతను, పంక్తి భేదముచేయుటచేతను, అన్నవిక్రియము చేయుటచేతను, పాకద్రవ్య ములను హరించుటచేతను స్త్రీలకు అనేకపాపములు కలిగియున్నవి: ఆ హేతువువలన వారికి మంచిలోకములులేవు, ముక్తి యెట్లుకల్గును?

శ్లో॥ క్రూరతాపిశునత్వంచ నిర్దయత్వంచసాహసం లోలుపత్వం గృహేదౌ చేత్కథంతా సాంహినిష్కృతిః । కేనోపాయేనదేవేశ మయి వాత్సల్యమస్తిచేత్ । పదశీఘ్రంమహాదేవ ముక్తిర్భవతి కేనవా ॥

తా॥ సమస్త దేవతలకు ప్రభువయిన యో సాంబమూర్తీ! దీక్ష క్రోధనమును, దుర్మార్గత్వమును దయ లేకపోవుటయును, అతిసాహసమును, గృహపసు పుత్రమిత్రాదులయందు ఆత్మాశక్తియును కలిగి తమకు నాయందు ప్రేమయున్నయెడల యే యుపాయముచేత వారికి ముక్తికలుగునో దానిని శీఘ్రముగాఁజెప్పుడని పార్వతీదేవి సాంబమూర్తిని అడిగెను.

ఈశ్వర ఉవాచ ॥శ్లో॥ పార్వత్యావచనం శ్రుత్వాసర్వాసాం ముక్తిదాయకం । ఉవాచపస్మితంవాక్యం సర్వలోక నమస్కృతిః ॥

తా॥ సమస్తలోకములచేతను నమస్కరింపబడుచున్న సాంబమూర్తి పార్వతీదేవియొక్క వాక్యమును విని సకల స్త్రీలకు మోక్షమిచ్చునట్టివాక్యమును చిఱునవ్వుతో పలికెను.

ఈశ్వర ఉవాచ ॥శ్లో॥ సాధుచోక్తం త్వయాభద్రే స్త్రీణాం లోకోనవిద్యతే । వ్రతమస్తిశుభంలోకే సర్వసంపత్ప్రదాయకమ్ ॥

తా॥ మంగళప్రదురాలయిన పార్వతీదేవీ! నీ వడిగినమాట మిక్కిలియుక్తముగానున్నది. స్త్రీలకు పుణ్యలోకములు లేకపోవుట నిశ్చయమే అయినను స్త్రీలకు యీలోకమందు సవ్వసంపదలనిచ్చునట్టిదియును, పరలోకంబున సమస్తదుఃఖముల నిచ్చునట్టిదియు నగు నొక వ్రతముగలదు.

పార్వత్యువాచ ॥ శ్లో॥ కేనచాదౌపురాచీర్ణం మర్త్యలోకేప్రకాశితం । కిమంత్రైః పూజ్యతే దేవకిపుష్పైః కింఫలంభవేత్ ॥ కానిమంత్రాణిదేవేశ వ్రతస్యాస్య మహామతే । ఉద్యాపనావిధానం చత్వయా వాచ్యందయానిధే । బ్రూహిసర్వం సురాధ్యక్ష తత్రకా నామదేవతా॥

తా॥ ఓ సాంబమూర్తీ! తమరు సెలవిచ్చిన యీవ్రతము మొట్టమొదట ఎవరిచేత అనుష్ఠింపబడిన ఈమర్త్యలోకమందు ప్రకాశింపఁబడినది? ఈ వ్రతాధిదేవత ఎవరు? ఈవ్రతోక్త దేవతను ఏమంత్రములచేత

ఏ పుష్పములచేత పూజింపవలయును? ఈవ్రతము పేరేమి? ఇదిచేసినందు వలనఁ కలుగు ఫలమేమి? ఏమంత్రములచేత వ్రతసమాప్తిఁ జేయవలయుదు? ఉద్యాపనచేయువిధమేలాగు? ఆవృత్తాంతమంతయు దయకు స్థానభూతుఁడవయిన సాంబమూర్తీ! చెప్పుము.

ఈశ్వరఉవాచ ॥ శ్లో॥ శృణుదేవి ప్రవక్ష్యామి గుహ్యాద్గుహ్యతమంశుభం। అనాయాసేవమర్త్యానాం నారీణాంచవిశేషతః॥ పుత్రపౌత్ర ధనైశ్వర్య దాయకం సర్వసాధనం। లక్ష వర్తివ్రతంనామ సర్వకామ ఫలప్రదమ్॥ లక్షవర్తివ్రతంలోకేయానారీకురుతేముదా। లక్షజన్మార్జితం పాపం తత్క్షణాదేవనశ్యతి॥

తా॥ ఓ పార్వతీదేవీ వినుమా! మిక్కిలి రహస్యములునదియు శుభప్రదమయినదియు అనాయాసముగా-సామాన్యముగా పురుషులకును, విశేషముగా స్త్రీలకును పుత్రులను, మనుమలను, ధనమును, ప్రభుత్వమును కలుగ జేయునట్టిదియును, సర్వకార్యములకు సాధనమయినట్టిదియును, సమస్తవాంఛితముల నిచ్చునట్టిదియును, లక్షవర్తి వ్రతమను ప్రసిద్ధిగలదియు నగు నొక వ్రతముకలదు, ఈవ్రతము ఏస్త్రీ సంతోషముతో జేయుచున్నదో ఆస్త్రీయొక్క లక్ష జన్మములయందు చేయఁబడిన పాపరాశియంతయు తత్క్షణమందే నశించును.

శ్లో॥ వ్రతస్యాస్యక్రమ వక్ష్యే శృణుపార్వతిసాంప్రతం। ఆషాఢస్యసితేపక్షే దశమ్యాంనియతో వ్రతీః ఏకవారంతు భుంజీత విష్ణోః ప్రీత్యై శుభాననే। ప్రాతరుత్థాయనియతో ఏకాదశ్యామతంద్రితః ఆహ్నికంతు తతఃకృత్వా వ్రతీ సతుష్టమానసః। దేవదేవ జగన్నాథ లక్ష్మ్యాసహ జగత్పతే॥ తవప్రీతికరం దివ్యం లక్షవర్తివ్రతంహరేః కరిష్యామి జగన్నాథ అనుజ్ఞాం దాతుమర్హసి॥ నిర్విఘ్నం కురుదేవేశ దేవ దేవరమాపతే। సంకల్పమేవంకృత్వాఽదౌ వ్రతమేతదుపక్రమేత్॥

తా॥ ఓ పార్వతీదేవీ! ఈలక్షవర్తివ్రతమును జరుపునట్టి విధానమును జెప్పుచున్నాను వినుము. ఈవ్రతము నాచరించువారు నియమముగలవారై ఆషాఢశుక్లదశమియందు విష్ణుప్రీతికొఱకు ఏకభుక్తము చేసి మఱునాడు ఏకాదశియందు బద్ధకములేనివారై ఉషఃకాలమునందు

లేచి నిత్యకర్మలను జేసికొని సంతోషముతోఁగూడుకొన్న మనస్సు గలవారై "సమస్తలోకములకు ప్రభువైనటువంటి శ్రీ విష్ణుమూర్తీ ! మీకు సంతోషకరమయినదియును, దివ్యమయినదియును నగు లక్ష వర్తివ్రతమును జేసెదను మీరు నాకు అనుజ్ఞనుదయచేసి యీ వ్రత మునకు విఘ్నము లేకుండ అనుగ్రహింపవలె" నని విష్ణుధ్యానము చేయవలయును.

శ్లో॥ మూఢాది దోషరహితే అఖండాయాంతిథౌ ప్రభో । ఆషాఢస్యాపి తేపక్షే ఏకాదశ్యా ముపక్రమేత్ । ఉపవాసవ్రతానిహ వ్రతీ కుర్యాదనన్యధీ। వర్తయోలక్షణ సంఖ్యాచ్ఛకారయేచ్చ యథాక్రమమ్ కార్తికేశుక్లపక్షేచ ఏకాదశ్యాం సమాసయేత్ । ద్వాదశ్యాంకారయే ద్దేవి హోమం బ్రాహ్మణభోజనమ్ ॥ ఇతరాణిచవర్ణాని పౌర్ణమాస్యాం సమాపయేత్ । లక్షవర్తికృతైర్దీపైః ఘృతనీరాజనైరపి । ప్రత్యహం పూజయేద్దేవం యావల్లక్షం సమాపయేత్ ॥

తా॥ మూఢాదిదోషములు లేనిదియును, ఖండముకానిదియు నగు తిథియందు ఆషాఢశుక్ల ఏకాదశియందు ఈవ్రత ప్రారంభముచేసి నియమముగలవారగుచు ఉపవాసాది వ్రతములు చేసి కార్తికశుక్ల ఏకా దశీదినమందు హోమమును బ్రాహ్మణ సంతర్పణమును జరుపఁదగిన ఈవ్రతము బ్రాహ్మణేతరులు చేయుపక్షంబున పౌర్ణమాస్యయందు సమాప్తిఁబొందింపవలయును. ఓ పార్వతీదేవీ ! లక్షదీపారాధనలు సమాప్తియగువరకు ప్రతిదినమందు ఈలక్షవర్తిచేత వెలిగింపఁబడిన దీపారాధనముల తను, యితరములగు ఘృతదీపారాధనములచేతను, కర్పూరనీరాజనములచేతను నారాయణమూర్తిని పూజింపవలయును.

శ్లో॥ సువాసినీనాంనారీణాం విధవానాంతథైవచ । గోప్యాని చైవపాపాని ప్రకటానితథైవచ ॥ ప్రాయశ్చిత్తవిహీనాని దుస్పృహోస్యాపి వల్లభే । లక్షవర్తిప్రభావేన సర్వేనశ్యంతితీక్ష్ణితమ్ ॥ కోటయోబ్రహ్మ హత్యానా మగమ్యాగమకోటయః । దహ్యంతే లక్షవర్తీనాం దీపానా మనలోకతః ॥

తా॥ ప్రియురాలయిన యో పార్వతీదేవీ! సువాసినీ స్త్రీ

యొక్కయును, విధవలయొక్కయును, రహస్యకృతములగు పాపములును, బాహ్యములగు పాపములును, ప్రాయశ్చిత్తములేని పాపములును, సహింపశక్యముగాని పాపములును యివన్నియు లక్షవర్తి ప్రభావము చేత నశించుచున్నవి. నిశ్చయము. మఱియును కోట్లతఁబడి బ్రహ్మహత్యాదిదోషములును: అగమ్యాగమ దోషములును లక్షవర్తి దీపారాధనములు చూచుటచేతనే ఆదోషములన్నియును తగులబెట్టఁబడుచున్నవిసుమా !

పార్వత్యువాచ ॥ శ్లో॥ పూర్వంకయాకృతం చైనద్వ్రతం శంకరమేవచ । తత్సర్వంశ్రోతుమిచ్ఛామి కృపాఽస్తియదితేఽనఘః ॥

తా॥ పాపరహితుఁడయిన యో సాంబమూర్తీ ! నాయందు తమకు దయయున్నయెడల యీ లక్షవర్తివ్రతము పూర్వమందు ఎవరిచేత నాచరింపఁబడినదో ఆ శమస్త వృత్తాంతమును జెప్పుడు. వినఁ గోరుచున్నాను,

ఈశ్వరఉవాచ ॥ శ్లో॥ ఇతిహాసం ప్రవక్ష్యామి సర్వపాపహరం శుభం । ఆర్యావర్తేపురాకాచీ ద్వేశ్యాఽభూల్లక్షణాహ్వయా తస్యాః భుజంగశ్చారోఽభూ ద్దాసోనామయువాబలీ ॥

తా॥ సమస్తపాపములను పోగొట్టునట్టి యితిహాసమును జెప్పుచున్నాను వినుము. పూర్వకాలమున ఆర్యావర్తదేశమందు లక్షణయను పేరుగల యొకానొక వేశ్యాస్త్రీకలదు దానికి పిన్నవయస్సుగలవాఁడును, మిక్కిలి బలముగలవాఁడును, దాసుడను పేరుగల యొకానొక విటుఁడుగలడు.

శ్లో॥ సాలక్షణాబుతుస్నాతా స్థితా గోదావరీతటే । అనిదూరే దదర్శాథ బ్రాహ్మణీం మృతభర్తృకాం ॥

తా॥ ఆ లక్షణ బుతుస్నాతయై గోదావరీతీరంబున నివసించి నదై ఆసమీపంబున నొక బ్రాహ్మణుల చిన్నది మృతినొందిన భర్తను ముందుంచుకొని రోదనము జేయుచుండఁగా దానిని జూచెను.

శ్లో॥ బాల్యేవైధవ్యదోషేణ రుదంతీకరరీ మివ । మృతంపతిం

పురప్రసావ్య బంధుభిః పరివారితాం । విలపంతీంతు సా వీక్ష్యసన్నైస్తాం ప్రిత్యపత్న్య ॥

తా॥ బాల్యమందు వైధవ్యదోషముచేత మృతుఁడయిన పతిని ముందఱ నుంచుకొని బంధువులచేత చుట్టుకొనంబడి చక్రవాకాంగన వలెనే మిక్కిలి యేడ్చుచున్న యా చిన్నవాని దగ్గఱకు ఆ లక్షణ వెళ్ళినదాయెను.

శ్లో॥ లుఠంతీంభువికాయేన మహుర్ఘ్నంతీముకోబహు । దృష్ట్వా సాలక్షణావాక్యం స్వంభుజంగమువాచహ ॥

తా॥ భూమియందుఁబడి పొరలుచున్నట్టిదియుః మాటిమాటికి వక్షస్థలమందు బాదుకొనుచున్నట్టిదియు నగు నా చిన్నదానిని జూచి ఆలక్షణ తననిటుఁడగు దాసునితో నొక వాక్యమును పలికెను.

శ్లో॥ కులజానాంచనారీణాం దశేయమతిదారుణా । పరవశ్యంచ నారీణాం దుఃఖమా మరణాంతికమ్ ॥

తా॥ కులస్త్రీలకుఁగలుగు దారుణమయిన దశయిదిగదా । స్త్రీలకు మరణపర్యంతము పరాధీనత గలిగియుండుట మిక్కిలి దుఃఖకరము.

శ్లో॥ మృతాపత్యంచ వైధవ్యంలఘైవాపుత్రితా స్త్రీయాం ॥ అసహ్యామేత త్త్రిత్రియం వైధవ్యంతత్రిచోత్తరమ్ ॥

తా॥ ఓ దాసుఁడా ! బిడ్డలు వచ్చుచుండుటయును, సంతానము లేకపోవుటయును, వైధవ్యము కలుగుటయును మిక్కిలి సహింపశక్యము కానివి వీనిలో వైధవ్యదుఃఖము మిక్కిలి కష్టతరముసుమా !

శ్లో॥ బాలేయంశోచ తేఽతీవ స్వేదంకర్మణఃఫలం । నివర్త్య తేనాకేనేదం కోవావే త్తినదానఘ ॥

తా॥ ఈచిన్నది బాల్యమందే వైధవ్యముఁబొంది ఈవిధముగా దుఃఖించుటకు కారణమైన పూర్వజన్మకర్మమును యెవరు దెలిసికొను చున్నారో, ఎవరు యీకష్టదశను మళ్ళింపగలరో వారిని జెప్పుమా ?

శ్లో॥ ఉవాచదాననామాఽసా భుజంగశ్చ శుభంవచః। శుృణు భద్రేప్రవక్ష్యామి దృష్టాన్సృష్టావురా ద్విజాః । దేహినాం చైవలోకా

నాం హితార్థం మంత్రికోవిదాః। శాస్త్రజ్ఞానాత్స్వభావాచ్చజీవినాంచ పురాకృతం । జ్ఞానంతికర్మజఫలం వదతివచదృష్టపత్రాః ॥

తా॥ దాసుఁడను పేరుగల విటుఁడు శుభమయిన వాక్యమును పలికెను. శుభప్రదురాల నయిన యో లక్షణా ! చెప్పుచున్నాను వినుము. సమస్త ప్రాణులకును సమస్త లోకములకును హితముగలుఁగ చేయునిమిత్తము బ్రహ్మదేవునిచేత వేదవేత్తలయిన బ్రాహ్మణులు సృజింపఁబడిరి. వారు శాస్త్రజ్ఞానముచేతనుఁ స్వభావముచేతను ప్రాణులయొక్క పూర్వజన్మమందు చేయఁబడిన కర్మఫల విశేషములను దెలిసికొనుచున్నారు. ఇదిగాక యితరులకుఁ జెప్పుచున్నారు.

శ్లో॥ భుజంగవచనంశ్రుత్వా తథాహీంతిచసాపునః। తత్రాగతం మహావృద్ధం వేదశాస్త్రార్థకోవిదమ్ ॥ యాజికఁనామవిప్రేద్రం జ్వలంతమివభాస్కరం । ప్రపచ్ఛదండయాధీనా త్యక్తకౌతుకమానసా ॥

తా॥ ఆలక్షణ దాసునియొక్క వాక్యమును విని నీవు చెప్పిన మాట యుక్తమైనదేయని పలికి ఆగోదావరీనదికి స్నానార్థమై వచ్చి నటువంటివాఁడును, మిక్కిలి పెద్దవాఁడును వేదశాస్త్రములయొక్క యర్థమును బాగుగఁదెలిసినటువంటివాఁడును,మిక్కిలిప్రకాశింపుచున్న సూర్యునివలె నున్నటువంటివాఁడు నగు యాజకుఁడను ప్రసిద్ధుఁడగు బ్రాహ్మణశ్రేష్ఠునిఁజూచి దయాధీనురాలయి సంతోషములేని మనస్సు గలదై ఒకవాక్యమును పలికెను.

లక్షణోవాచ॥ శ్లో॥ మునేత్వహందురాచారా కులటా లక్షణాభిదా । తథాపితేదయాపాత్రం పృచ్ఛంతీంమాంవదప్రభో ॥

తా॥ ఓముని శ్రేష్ఠుఁడా ! నేను లక్షణ యను పేరుగల వేశ్యను దురాచారముగలదానను. అయినను మీయొక్కదయకు పాత్రిభూతురాలనయి అడుగుచున్నాను చెప్పుఁడు.

శ్లో॥ సాధూనాంసమచిత్తానాం జనాస్సర్వే సమాభువి । దుర్గంధోవాసుగంధోవా యథావాయోస్సమోభవేత్ ॥

తా॥ వాయువునకు దుర్గంధమైనను, సుగంధమైనను ఏప్రకారముగా సమానమై యుండునో ఆప్రకారముగానే సమభాగము గల

సత్పురుషులకు సమస్తమనుజులు యెక్కువతక్కువలు లేక సమానము గానే తోఁచుచున్నది.

శ్లో॥ మునేవ శేయంనారీణాం తృతీయాఽతీనమస్పహా । కర్మణా జాయతే కేన కేనవాస్యానివర్తనం ఏతద్విస్తార్యమే విద్వాం కృపయా వచ సువ్రత ॥

తా॥ ఓ ముని శ్రేష్ఠుఁడా! స్త్రీలకు మూఁడవది యైనయీవైధవ్యదశ మిక్కిలి సహింపశక్యముగానిది, పూర్వజన్మమందుఁ జేయఁబడిన యేకర్మముచేత యీయవస్థ వీరికి సంప్రాప్తమగుచున్నదో యిప్పుడు యేకర్మముచేత యీవైధవ్యదోషము పోవుచున్నదో మహానుభావుఁడవయిన యో బ్రాహ్మణ శ్రేష్ఠుఁడా! ఇదియంతయు విస్తరించి నాకు జెప్పుమా.

శ్లో॥ లక్షణావచనంశ్రుత్వా యాజకోవాక్యమబ్రవీత్ । దైవే కర్మణిపిత్ర్యేచ నార్యః సేకేషు సంస్థితాః । అకస్మాద్రజసోదోషాత్ స్పృష్టభాండా ద్యుపస్కరాః । అజ్ఞానాద్వా భయాద్వాపి కామాల్లోభా త్క్వచిత్ స్త్రియః । అనేనయిత్వా గచ్ఛంతి తేన దుష్యంతి సత్క్రియాః ॥

తా॥ అప్పుడు యాజకుఁడను బ్రాహ్మణుఁడు లక్షణయొక్క వాక్యమునువిని యిట్లని పలికెను. ఓలక్షణా! స్త్రీలు దేవ పితృకార్యములయందు పాకముఁ జేయుచున్నవారై హఠాత్తుగా బయటనున్నవారగుచు కుండలు మొదలుగాగల యుపకరణములను స్పృశించిన వారగుచు అజ్ఞానమువలనగాని, భయమువలనగాని, కామమువలనగాని దానిని తెలియఁజేయక పాకములు మొదలగునవి చేయుచుండుదురు. అందువలన సత్కర్మలన్నియు చెడిపోవును.

శ్లో॥ క్రియాలోపకరా హ్యేతాః పాపాదస్మా ద్దురత్యయాత్ । దశాపినూంప్రాప్నువంతి సర్వాలపినసంశయః ॥ బాల్యేఽపి యావనే వాపి ర్థక్యేనా కదాచన ॥

తా॥ సత్కర్మములను దూషింపఁజేయునట్టి యాస్త్రీలు నిరా

రింప శక్యముగాని యీ పాపము వలన బాల్యమందుగాని, యౌవన మందుగాని, ముసలితనమందుగాని ఈవైధవ్యదశను బొందుచున్నారు.

శ్లో॥ తత్రియాతుదురాచారా పరానేవాభికాంక్షతి। శ్వశ్రూశ్చ పతిబంధూనాం నిత్యంవాచా సుదుఃఖదా॥ ఏతత్పాపయుతానారీ యా దూషయతిసత్క్రియాః బాల్యే వైధవ్యమాప్నోతిసా నారీనాత్రిసంశయః। యాచానుకూల్న రహితాపతిధర్మేషుపర్వదా బాల్యేవైధవ్య మాపన్నా రతిహీనాభవత్యలమ్॥ సర్వాసామపివైధవ్య నిదానపుష్ప సంభవం। శాంతితస్యప్రవక్ష్యామి కర్మణోఽన్యచలక్షణే॥

తా॥ వారియందు యేస్త్రీ దుష్టమయిన యాచారముగలదగుచు నెల్లప్పుడు పరపురుషులనే కోరుచున్నదై నిరంతరము అత్తమామల కును, పెనిమిటికిని, బంధువులకును, కఠినవాక్కులచేత దుఃఖముకలుగ జేయుచున్నదో ఆస్త్రీయును, ఇదిగాక యేస్త్రీ రజస్సంబంధమైన దోష ముతో కూడుకొన్నదై సత్కర్మములను పాడుజేయుచున్నదో ఆస్త్రీ యును బాల్యమందు వైధవ్యమును బొందుచున్నారు. సంశయము లేదు. మఱియును యేస్త్రీయైనను నెల్లప్పుడు పతికిఁ జేయవలసి నయుప చారాది కర్మలయందు ప్రతికూలతగలదై యుండునో ఆచిన్నది బాల్య మందే వైధవ్యమును బొందినదై భర్తవలన సౌఖ్యమును బొందనిది అగుచున్నదిసుమా! అదియునుగాక యెల్ల స్త్రీలయొక్క వైధవ్యము నకు మూలకారణము రకస్సంపర్కదోషము. అరజోదోషమునకు దగిన శాంతిని జెప్పుచున్నాను వినుము;

శ్లో॥ లక్షవర్తివ్రతం సమ్యక్కర్తవ్యం పాపనుత్తయే। పాపం గచ్ఛతినారీణా మితివేదవిదోవిదుః॥

తా॥ ఈరజస్సంబంధమైన పాపము పోవుటకొఱకు లక్షవర్తి వ్రతము లెస్సగా జేయవలయును ఈవ్రతము,జే సినందువలన స్త్రీల యొక్క పాపమంతయు నశించిపోవునని వేదవేత్తలు చెప్పుచున్నారు.

శ్లో॥ పూర్ణశూర్పం సువాసిన్యా దాపయేచ్చ ముదానిత్వా॥ మూలాదశేషం ప్రజతి రజోదోషం నసంశయః॥

తా॥ ఈ వ్రతము నాచరించునప్పుడు సువాసినీలకు సంపూర్ణ

మైన మూసివాయనము నిచ్చినట్టయితే రజోదోషము సమూలముగ నంతయు నశించుచున్నది.

శ్లో॥ నిర్మూలంతు వ్రజత్యాశు లక్షవర్తివ్రతేకృతే। రజసోత్థం మహాత్పాపం నారీణాంతు నసంశయః॥

తా॥ లక్షవర్తివ్రతము చేయంబడ్డదగుచుండఁగా స్త్రీలయొక్క రజస్సంబంధమైన మహాపాపమంతయు నిర్మూలమై పోవుచున్నది.

శ్లో॥ ఇతిద్వచనంశ్రుత్వా పునః పప్రచ్ఛ లక్షణా। మనసా భూత్వా నాదరం మునిపుంగవమ్॥

తా॥ ఆలక్షణ యాజకునియొక్క యీవాక్యము విని మనస్సులో సందేహించుచున్నదై ఆదరముతోఁ గూడుకొన్నట్టుగా ఆ మునిశ్రేష్ఠునితోఁ ఒకవాక్యమును బలికినదాయెను.

శ్లో॥ సాధుసాధు మహాభాగ చిత్తంమే భయనిహ్వాలం॥ లక్షవర్తివ్రతస్యాస్య విధానంకీదృశంవద। కస్మిన్కాలే ప్రకర్తవ్యం కస్యవాతత్సమర్పణం। ఉద్యాపనంకథంకార్యం కింఫలంతస్యవామునే॥

తా॥ మహానుభావుండవగు నో మునిశ్రేష్ఠుఁడా! మీరు సెలవిచ్చినది మిక్కిలి బాగుగనున్నది. నామనస్సు భయముచేత మిక్కిలి తొట్రుపడుచున్నది. ఈ లక్షవర్తి వ్రతముయొక్క చేయఁదగిన క్రియ తొట్రుపడుచున్నది. ఈ లక్షవర్తి వ్రతముయొక్క చేయఁదగిన క్రియ మెట్లు? ఈవ్రతము జేప్పుడు చేయవలెను? పూజయొక్క ఫలమే దేవత తర్పణము చేయువలయును? ఉద్యాపనము చేయవలెను? ఈ లక్షవర్తివ్రతమును జేసినందువలనఁ గలుగు ఫలమేమి? నాయందు దయయుంచి జెప్పవలయును.

శ్లో॥ తయాపృష్టో యాజకోఽపి లోకానాం హితకామ్యయా। వక్తుంప్రచక్రమేతస్యా లక్షవర్తివ్రతం శుభమ్॥

తా॥ యాజకుఁడను బ్రాహ్మణశ్రేష్ఠుఁడు ఆలక్షయను వేశ్య స్త్రీచేత అడుఁగబడినవాఁడయి సమస్తలోకములకు హితము కావలెనను కోరికచేత యిహపరములయందు శుభము కలుఁగజేయునట్టి లక్షవర్తివ్రతమును జెప్పుట కారంభించెను.

యాజకః శ్లో॥ వాసుదేవే ప్రసుప్తేతు చాతుర్మాస్యాం విశేషతః। ఆషాఢేశుక్లపక్షేతు ఏకాదశ్యాం సమారభేత్ । కార్తికేమాసిచేత్కుర్యా ద్వ్రతం మంగళదాయకం । సహస్రగుణితం దత్తం ఫలమోక్షద మవ్యయమ్ ॥

తా॥ ఈ వ్రతము చాతుర్మాస్యలయందు విశేష ఫలప్రదమైనదియు, ఆషాఢశుక్ల ఏకాదశియందు శ్రీమన్నారాయణమూర్తి వటపత్రమందుశయనించియున్నవాఁడగుచుండఁగా నీవ్రతము ప్రారంభించి కార్తికశుక్ల ఏకాదశియందు సద్గతిని కలుగఁజేయు నీలక్షవర్తివ్రతము నాచరించినయెడల వారికి వేయిరెట్లు ఫలముగలదు.

శ్లో॥ కార్తికేచైవ వైశాఖే మాఘేచైవవిశేషతః । చైత్రేఽపిచ శుభంప్రోక్తం యథావిభవసారతః ॥ ఉద్యాపనవిధాంవక్ష్యే సర్వదాం సర్వమోహినిమ్ । ప్రాతస్స్నాత్వా శుచిర్భూత్వా పంచగవ్యంతు ప్రాశయేత్ ॥

తా॥ ఈ వ్రతము కార్తికమాసమందైనను, వైశాఖమాసమందైనను, మాఘమందైనను, చైత్రమందైనను శక్తిలోపము లేకుండ నాచరింపవలెను. సమస్త సంపదలనిచ్చునట్టియు, ఎల్లవారిని మోహింపఁజేయునట్టిదియు నగు ఉద్యాపన క్రమమునుఁ జెప్పుచున్నాను వినుము. వ్రతముఁజేయు మనుజుఁడు ప్రాతఃకాలమున స్నానముఁజేసి నిత్యకృత్యములను నెఱవేర్చి పంచగవ్యప్రాశనమును జేయవలెను.

శ్లో॥ పుణ్యాహవాచనంకృత్వా ఆచార్యంపరయేత్తత॥ । ఋత్విగ్భిర్బ్రాహ్మణైర్యుక్తం కుర్యాత్తర్పణమంజసా ॥

తా॥ తరువాత పుణ్యాహవాచనముఁజేసి ఋత్విక్కులగు బ్రాహ్మణులతోఁగూడుకొని తర్పణము చేయవలెను.

శ్లో॥ అక్షతైశ్చయవైర్వాపి లక్ష్మీనారాయణంప్రతి । దశాంశతఃప్రకుర్వీత వర్తీనాంతర్పణాంబుధః ॥

తా॥ విద్వాంసుఁడగు మనుజుఁడు లక్షవత్తులయొక్క సంఖ్యయందు దశాంశసంఖ్య [పదివేలు] అక్షతలచేతను, యవలచేతను, పాలచేతను లక్ష్మీనారాయణమూర్తినిగూర్చి తర్పణము జేయవలెను.

శ్లో॥ తర్పణస్య దశాంశేన హోమంకుర్యా ద్యథావిధి । తర్ప ణో క్తేన మంత్రేణ పాయసంచఘృ తాన్వితమ్ ॥

తా॥ తర్పణసంఖ్యయందుద శాంకసంఖ్యచేత నగా [౧౦౦౦] చేత నారాయణగాయత్రీ మంత్రముచేత పరమాన్నమును, ఘృతమును కలిపి హోమముఁ జేయవలెను.

శ్లో॥ సాయంకాలేతు సంప్రాప్తే శుచిర్భూత్వా సమాహితః । గోమయేనానులిప్యాథ చతురశ్రంతుమండలమ్ ॥

తా॥ వ్రతము చేయువాఁడు ప్రదోషకాలమందు శుచిగలవాఁ డగుచు నేకాగ్రచిత్తముగలవాఁడై నాలుగుమూలలుగలిగిన వేదికను నిర్మించి అందుపైని గోమయముతో నలికి

శ్లో॥ తన్మధ్యేష్టదళంపద్మం పంచవర్ణై స్సుశోభితం । నిధాన మక్షందండై శ్చ కర్ణికాభై స్సుశోభితమ్ ॥ తన్మధ్యేవస్త్రమా సీర్యతం కులాన్ప్రస్థపంచకాః । తన్మధ్యే కలశందివ్యం పంచపల్లవశోభితమ్ ॥

తా॥ ఆ వేదికయొక్క మధ్యమందు నెనిమిది దళములు గలిగి సటువంటిదియు, అయిదువర్ణములచేతఁ బ్రకాశించుచున్నదియునగు పద్మమును లిఖించి చెరుకుగడలచేత చాందినిఁగట్టి వానియొక్క మధ్య మందు దివ్యవస్త్రముఁను బఱచి అయిదుకుంచములు బియ్యముఁపోసి ఆబియ్యముయొక్క మధ్యమునందు అయిదుపల్లవములచేత ప్రకా శించుచున్న దివ్యమైన యొక కలశమును స్థాపించి

శ్లో॥ వస్త్రోపరిన్యసేద్దేవం లక్ష్మీనారాయణంవిభుం । బ్రహ్మణః కలశంవస్త్రం నిక్షిపేత్తండులోపరి । త్రయస్త్రింశ త్సుకోభాఢ్యాః కలశాః విన్యసేత్తతః ॥

తా॥ అవస్త్రముపైని లక్ష్మీనారాయణ వ్రతమును ఆవాహ నము చేయవలెను. బ్రహ్మకలశమునుంచి ఆ మంటపమునందు తండుల ములుపోసి దానిపైన పరిశుభ్రమైనవియు, చక్కగా నలంకరింపఁబడిన [33] ముప్పదిమూఁడు కలశములను, వస్త్రములను, ప్రతిమలను స్థాపించి ఇంద్రాద్యష్ట దిక్పాలక సహితేముగా నావాహనమును చేసి

శ్లో॥ నిక్షిప్యపంచరత్నాని పంచకోమలపల్లవాన్ । ప్రతిమా శోధనంకృత్వా నిక్షిప్యకలశోపరి ॥ ప్రాణప్రతిష్టాం కుర్వీత షోడశైరుపచారికైః ॥ యామేయామేతు పూజాంచ కుర్యాజ్జాగరణంనిశి ॥

తా॥ ప్రధానకలశముమీఁద అయిదురత్నములను మృదువైన అయిదుపల్లవములను వుంచి ప్రతిమా శోధనములను షోడశోపచారములచేత లక్ష్మీనారాయణమూర్తి పూజచేసి రాత్రియంతయు జాగరణముఁ జేయవలయును.

కించ॥ ॥శ్లో॥ త్రింశత్ఫలం కాంస్యపాత్రంగోఘృతేనప్రపూరితం। సువర్ణవర్తిసంయుక్తం రాజతేవాభిశోభితం । కార్పాసవర్తినా సమ్యక్సంయుతం దీపముత్తమం । దేవస్యపురతః స్థాప్య యామేయామేచ పూజయేత్ ॥

తా॥ ముప్పదిఫలముల యెత్తుగలిగిన కంచుగిన్నె నిండునట్లు ఆవునెయ్యిపోసి బంగారపువర్తిని, వెండివర్తిని, దూదివర్తిని అందుంచి మంటపావాహనగానకు ముందుగా దీపారాధనముఁజేసి పిమ్మట ప్రతి యామమందు క్రమముఁదప్పక పూజింపవలెను.

శ్లో॥ నృత్యగీతాదివాద్యైశ్చ పురాణశ్రవణేనచ । సద్గోష్ఠీ వేదఘోషైశ్చకుర్యాజ్జాగరణంనిశి । పరేఽహ్ని ప్రాతరుత్థాయ కుర్యాద్వై దంతధావనం । దద్యాంస్నాత్వా ద్విజప్రోక్తైః ప్రవిశేద్గృహముత్తమమ్ ॥

తా॥ నృత్య గీత వాద్యములచేతను, పురాణశ్రవణము చేతను సత్పురుషులయొక్క గోష్ఠిచేతను, వేదవాదము చేతను రాత్రిజాగరణముఁ జేసి మఱునాఁడు ప్రాతఃకాలమందు లేచి దంతధావనాదికృత్యములను దీర్చి నదిలో స్నానముఁ జేసి బ్రాహ్మణులయొక్క స్వస్తివాచనములతోఁగూడ గృహమునకుఁ బ్రవేశింపవలెను.

శ్లో॥ హోమంచ బ్రాహ్మణైః కార్యం స్వగృహ్యోక్తవిధానతః ॥ పాలాశైస్సమిధైశ్చైవ వరుణాసాయసేనచ । నారాయణస్య గాయత్ర్యా హోమంకుర్యాద్యథావిధి । తతో జయాదిహోమంచ పూర్ణాహుతిరనంతరమ్ ॥

తా॥ బ్రాహ్మణులతోఁ గూడుకొని గృహ్యసూక్త ప్రకారముగా హోమమును మోదుగ సమిధలతోఁడను హవిస్సుతోఁడను పరమాన్నముతోఁడను, ఘృతముతోఁడను యథావిధిగా నారాయణ గాయత్రీమంత్రముచేత [౧000] మారులు హోమముఁ జేయవలెను. అనంతరంబున జయాదిహోమమును, పిమ్మట పూర్ణాహుతిని జేయవలయును.

శ్లో॥ పునఃపూజాంచ నైవేద్యం ధూపనీరాజనాదిభిః । క్షమార్పణంచకుర్వీత స్తోత్రైర్నానావిధైరపి ॥

తా॥ తిరిగి ధూపదీపనైవేద్యములచేత పునఃపూజఁజేసి నానావిధస్తోత్రములచేత క్షమార్పణముఁ జేయవలెను.

శ్లో॥ ఆచార్యాయ సదారాయ దరిద్రాయ కుటుంబినే । శ్రుతిజ్ఞాయస్మృతజ్ఞాయ శాంతాయచ సుశీలినే । సవస్త్రమంటపం దద్యాద్వ్రతీభక్తి సమన్వితం ॥

తా॥ భార్యతోఁగూడుకొన్న వాఁడును, దరిద్రుఁడైనవాడును కుటుంబవంతుఁడయినట్టివాఁడును. శాంతుఁడయినట్టి వాఁడును, మంచి స్వభావముగలఁవాడు నగు ఆచార్యునికొఱకు వస్త్రసహితమైన మంటపము నియ్యవలయును.

శ్లో॥ ఆచార్యం వేద విదుషం వస్త్రాభరణసంయుతం । గంధపుష్పాక్షతైరర్చైర్దూమ్నైశ్చపరిశోభితమ్ ॥ హరం విచింత్యమనసా ప్రతిమాంవస్త్రసంయుతాం । కాంస్యపాత్రంనదీపంచ గాంసవత్సాం పయస్వినీమ్॥ స్వర్ణశృంగీంరౌప్యఖురాం కాంస్యదోహనభాజనాం ॥ సవస్త్రాలంకృతాంనాంచ ఆచార్యాయ సమర్ప్యచ సఫలాం దక్షిణాందద్యాద్వ్రతశార్యం నకారయేత్ ॥

తా॥ వేదవిదుఁడైనట్టివాఁడును, వస్త్రాభరణములతోఁడఁ గూడుకొన్నట్టివాఁడును, గంధపుష్పాక్షతాదులచేత నొప్పుచున్నట్టివాఁడును నగు నాచార్యుని లక్ష్మీనారాయణమూర్తినిగా మనస్సునందుభావించి వస్త్రముతోఁ గూడుకొనిన కాంస్యపాత్రమును, దూడతోఁ గూడుకొన్నట్టిదియును పాలిచ్చునట్టిదియును, బంగారవు కొమ్ములును, వెండి

కొమ్ములును గలిగినట్టిదియును, పాలు పితుకుటకు కంచుగిన్నె కలిగినట్టిదియును, వస్త్రాదులచేత నలంకరింపఁబడినదియు నగు శ్రేష్ఠంబగు గోవును దానముచేసి ఫలముతోఁగూడ కొనిన దక్షిణతోఁగూడ గోదాన విధిగా దానము చేయవలయును. ఈవ్రతమునుగూర్చి శక్తియుండియు ధనలోపము చేయఁగూడదు.

శ్లో॥ బ్రహ్మణఃకలశం దద్యాత్ ఋత్విజశ్చ ప్రపూజయేత్ తేనైఃవపూజాంకుర్యాచ్చ బ్రాహ్మణానాంస్వశక్తితః॥ ఋత్విగ్భిస్సహ విప్రైశ్చ బంధుభిర్భోజయేత్తతః॥

తా॥ ఆచార్యునికొఱకు బ్రహ్మకలశము న్విచ్చ మిగిలిన కలశములు ఋత్విక్కులను పూజచేసి యియ్యవలెను. పిమ్మట స్వశక్త్యనుసారముగ బ్రాహ్మణులతోడను, బంధువులతోడను గూడుకొని భోజనము జేయవలెను,

శ్లో॥ వర్తిసంఖ్యాదశాంశం తత్తర్పణం కారయేత్సుధీః। తద్దశాంశంతుజుహుయా ద్దశాంశం విప్రభోజనమ్॥

తా॥ లక్షవత్తులయొక్క సంఖ్యలో పదవయంశము తర్పణము పదివేలు. ఆసంఖ్యలో దశాంశము హోమము వేయిమాఱులు. ఆసంఖ్యలో దశాంశము ౧౦౦ బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును.

శ్లో॥ దీనాంధకృపణానాంగా న్పూజయేదన్న కాంక్షిణః। ద్వా ప్రసాదంవిప్రాణాం స్వయంభుంజీత బంధుభిః॥

తా॥ దీనులకును, గ్రుడ్డివాండ్రకును, కుంటివాండ్రకును అన్నమును గోరువారికిని భోజనము పెట్టి బంధువులతోఁగూడుకొని బ్రాహ్మణ ప్రసాదమును భోజనమును జేయవలయును.

శ్లో॥ యాచైవంకురుతేనారీ తస్యాఃపుణ్యఫలం శృణు॥ ఆవాచాన్యపిపాపాని రహస్యేన కృతానిచ। నశ్యంత్యేతానిసర్వాణి వ్రతస్యాస్య ప్రభావతః॥

తా॥ ఏస్త్రీ యీప్రకారముగా నీవ్రతముఁ జేయుచున్నదో ఆమె యొక్క పుణ్యఫలముఁ జెప్పుచున్నాను వినుము. వాక్కుచేత చెప్ప

శక్యముగానట్టిదియును రహస్యముగాఁ జేయబడ్డట్టిదియు నగు సమస్త పాపములు నశించుపోవుచున్నవి.

శ్లో॥ చండాలగామినీవాపి తథాశూద్రాభిమర్శినీ । పితృవ్యమాతులభ్రాతృ పుత్రజామాతృసంగతా ॥ బాలఘ్నీ వా కృతఘ్నీ వా మాతా పితృవధేరతా । గోఘ్నీ వా తస్కరీ వాపి రజస్సంకరకారిణీ । వహ్నిదా గరదా చైవ నిత్యం వాఽప్రియవాదినీ । పత్యౌ జీవతి యా నారీ వ్యభిచారీ భవేత్సదా । ఏవమాదిమహాపాపై రావృతాపి కులాంగనా । కృత్వా చైతద్వ్రతం పుణ్యం ముచ్యతేనాత్ర సంశయః ॥

తా॥ మఱియును, చండాలునితో గమనము చేసిన పాపమును శూద్రుని స్పృశించిన పాపమును పినతండ్రితోడను, మేనమామతోడను, అన్నదమ్ములతోడను, పుత్రులతోడను, అల్లునితోడను సాంగత్యముఁ జేసిన దోషమును, పసిపిల్లలను జంపిన పాపమును, చేసిన మేలు మఱచిన పాపమును, మాతాపితృ వధ చేసినపాపమును, గోహత్య జేసినపాపమును, దొంగతనము చేసినపాపమును, రజస్సంబంధమయిన పాపమును, గృహమందు నిప్పుబెట్టిన పాపమును, విషముఁబెట్టిన పాపమును, నిత్యమును నప్రియవాక్కులను పలికెను. పాపమును పతిజీవించి యుండఁగా వ్యభిచారముచేసిన పాపమును యీ మొదలగు పాపములతో గూడుకొన్నదయినను యీవ్రతమును జేసినట్లయితే సమస్తపాపములనుండియు విముక్తురాలగును.

శ్లో॥ వ్రతానాముత్తమంచైవ స్త్రీణామావశ్యకంత్విదం ॥ లక్షవర్తిప్రదానేన విష్ణోరమిత తేజసః ॥ కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః । తథైవాత్యుగ్రపాపానాం కోటయోఽథ సహస్రశః । నశ్యంతినాత్రసందేహో వార్యావాపి నరస్యవా ॥

తా॥ సమస్తవ్రతములలో శ్రేష్ఠంబగు నీ లక్షవర్తి వ్రతము స్త్రీలకు ముఖ్యంబైనది అమితమగు తేజస్సుకలిగిన విష్ణుమూర్తికి ప్రియమగు నీలక్షవర్తిదీప దానముల చేత స్త్రీయొక్కగాని, పురుషునియొక్కగాని కోటిబ్రహ్మహత్యాదిదోషములును, అత్యుగ్రపాపముల యొక్క కోట్లును నశించిపోవును. ఇందుకు సందేహము లేదు.

శ్లో॥ కిమత్రబహునోక్తేన నానేనసదృశంవ్రతం ॥ పురుషోఽపి వ్రతంకృత్వా పూర్వోక్తైః పాపసంచయైః । ముచ్యతే నాత్రసందేహో మధుశాశపశాసనాత్ ॥

తా॥ ఈవ్రతవిషయమైయనేకములగు మాటలతోనేమి ప్రయోజనము ? ఈలక్షవర్తివ్రతముతో తుల్యమగు వ్రతము లోకమునందు లేదు. విష్ణుమూర్తియొక్క యాజ్ఞవలన పురుషుఁడయి నను నీవ్రతమును జేసినయెడల పూర్వోక్త పాపములవలన విముక్తుఁడగుచున్నాడు.

శ్లో॥ ఏతత్సర్వం మయాఖ్యాతం పృచ్ఛంత్యాస్తవ మానదే । వ్రతంకురుసుఖంతిష్ఠ యథాతేరోచతేనమః ॥

తా॥ మర్యాదగల యోలక్షణా ! ఈవ్రతముయొక్క క్రమము నంతయుఁ నీకుఁ జెప్పితిని నీకు యిష్టమున్నయెడల యీవ్రతముఁ జేసి సుఖముగా నుండుము

శ్లో॥ ఇతితద్వచనంశ్రుత్వా పునఃప్రపచ్ఛ లక్షణా । అజ్ఞానాదుష్టభావాద్వా నవిశ్వాసోమమైనచ । ప్రత్యయార్థంతు తద్బ్రహ్మం ప్రత్యక్షంకురుమేఽధువా ॥

తా॥ ఈప్రకారముగఁబలికిన యాజకునియొక్క వాక్యమునువిని, ఆలక్షణ తిరిగి యేమనిపలికినదనఁగా — ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా ! అజ్ఞానమువలన తమరు సెలవిచ్చిన యీవాక్యములయందు నాకు విశ్వాసము పుట్టలేదు. కనుక నాకు నమ్మకము కలుగునిమిత్తము ప్రత్యక్షముగా ఫలము కనఁబఱపుము.

శ్లో॥ ఇతితద్వచనంశ్రుత్వా యాజకోవాక్యమబ్రవీత్ । కథంతే ప్రత్యయోబ్రూయా ఇతితాం కరుణానిధిః ॥

తా॥ మిక్కిలి దయగలయాజకుఁడు యీప్రకారముగాఁ బలికిన లక్షణయొక్క వాక్యమును విని నీకు నమ్మకము యేలాగు కలుగునో చెప్పుమని పలికెను.

శ్లో॥ సాచోవాచ పునర్విప్రం విస్మయోత్ఫుల్లలోచనా ॥ నవవైధవ్యసంయుక్తా కుమారీభృశదుఃఖితా। అస్యాఃపతిఃకథంజీవేత్ వైధవ్యంనైవగచ్ఛతి। తథాకురు మునిశ్రేష్ఠ దయాశమవతాం ధనమ్ ॥

తా॥ ఆలక్షణయును ఆశ్చర్యముగలదగుచు ఆ బ్రాహ్మణుని గూర్చి యిట్లని పలికెను. ఈచిన్నది నూతనమయిన వైధవ్యముతో గూడుకొన్నదగుచు మిక్కిలి దుఃఖమును బొందుచున్నది. కనుక ఈ చిన్నదానియొక్క భర్త జీవించినట్లును, ఈచిన్నది యెప్పటికిని వైధవ్యముఁ బొందకునట్లును, ఆనుజ్ఞ దయచేయవలెను. తమవంటి శాంతిపరులకు భూతదయాళుత్వమే ధనముకదా !

శ్లో॥ ఇతితద్వచనంశ్రుత్వా విస్మితో యాజకోఽబ్రవీత్ । లక్షవర్తిఫలందివ్యంశతస్యై ముదాయుతే ! తేనజీవేదయంనూనం బ్రహ్మహ్నాచ్ఛపురాభవే । తస్మాదయం రాజయక్ష్మ రోగేంచ మృతంగతివ తథాపి వ్రత మహాత్మ్యే జీవితం పునరేష్యతి ॥

తా॥ యాజకుఁడు లక్షణయొక్క యిటువంటివాక్యమును విని యాశ్చర్యముఁ బొందినవాఁడగుచు నొక వాక్యము బలికెను. ఓ లక్షణా! దివ్యమయిన యీలక్షవర్తి వ్రతమును జేసినఫలము నీచిన్నదానికొఱకిమ్ము. ఆఫలముచేత నీచిన్నదానియొక్క భర్త జీవించును ఇతఁడు పూర్వమందు బ్రహ్మహత్యఁ జేసినవాఁడు ఆపాపమువలన కలిగిన క్షయరోగముచేత మృతిఁబొందినవాఁడు అట్టివాఁడయినా నీ వ్రతముయొక్క మహాత్మ్యమువలన మరల జీవించును.

శ్లో॥ దానపయస్వ హరేర్మూర్తిం కాంస్యపాత్రంతథైవచ । జీః॥ పత్నీ భవేదాశు సత్యమాచారణాంతికమ్ ॥

తా॥ విష్ణుస్వరూపమయిన కాంస పాత్రమును ఆచార్యునికొఱకిమ్ము అందువలన నీచిన్నది శీఘ్రముగ జీవించిన భర్తకలది కాఁగలదు.

శ్లో॥ లక్షణావచనం శ్రుత్వా జలంస్పృష్ట్వాచవాగ్యతా । లక్షవర్తిఁవ్రతంకృత్వా దదౌచాస్తైఫలంముదా ॥

తా॥ లక్షణయును అవాక్యము విని ఆచమనముఁజేసి వాఙ్నియతిగలదై లక్షవర్తి వ్రతముజేసి వ్రతఫలమును ఆ బ్రాహ్మణుల చిన్నదాని కిచ్చినదాయెను.

శ్లో॥ తస్యపుణ్యప్రభావేన తత్క్షణాదేనచోత్థితః । కుమార్యా కారయామాస వైధవ్యస్యాపనుత్తయే ॥

తా॥ ఈవ్రతము యొక్క పుణ్యముచేత నా చిన్నదానియొక్క భర్త బ్రతుకలేచెను. అప్పుడు లక్షణ యాచిన్నదానిచేతకూడ నీవ్రతమును జేయించినదాయెను.

శ్లో॥ ఏతత్పుణ్యప్రభావేన కుమారీసా చశోభనా॥ యావజ్జీవం జీవపత్నీ బభూవబహుపుత్రికా ॥

తా॥ ఈ వ్రతప్రభావముచేత నాచిన్నది శుభముతోఁ గూడుకొన్నదై బ్రతికియున్నంతవఱకు జీవించిన పెనిమిటికలదియు, బహు పుత్రులుగలదియు నాయెను.

శ్లో॥ తద్బాంధవా స్తదాసర్వే తుష్టువుస్తాంచ లక్షణాం। యాజకంచైవసంప్రీత్యా జగ్ముస్తేవిజయమందిరం।లక్షణాచాపిదాసేనభుజంగేనచసంయుతా। లక్షవర్తివ్రతంకృత్వా కల్పోక్తవిధిపూర్వకం। ఇహలోకేసుఖంభుక్త్వా మృతావైకుంఠమానసా ॥

తా॥ అప్పుడా చిన్నదాని బంధువులును, సమస్తజనులును యాజకుఁడను బ్రాహ్మణుని, లక్షణను బహువిధముల స్తుతించ తమ గృహములకు వెళ్ళినవారైరి లక్షణయును తనపతియగు దాసునితోఁ గూడుకొనినదై కల్పోక్తవిధిగా నీవ్రతముఁజేసి ఇహలోకమందు సకల సుఖములు ననుభవించి అంతమందు వైకుంఠమును బొందినదాయెను.

శ్లో॥ తతస్తుమరణం ప్రాప్తో దాసస్తస్యాస్సహాయకృత్ । మహారాజకులేజాత శ్చక్రవర్తీబభూవహ ॥ సాలక్షణా చతత్పత్నీ సర్వలక్షణ సంయుతా । బభూవసర్వవిఖ్యాతా జీవపత్నీ సుపుత్రికా ॥

తా॥ తఱువాత లక్షణయను వేశ్యాస్త్రీకి సాహాయ్యముచేసిన దాసుఁడు మృతిబొందినవాఁడై మహారాజకులమందుబుట్టి చక్రవర్తి యాయెను. అలక్షణయును సర్వస్త్రీలలోఁ బ్రసిద్ధికెక్కినదై సర్వశుభ లక్షణములతోఁగూడుకొన్నదై యాదాసునికి పత్నియైనదాయెను.

శ్లో॥ లక్షవర్తివ్రతస్యాస్య నారీనాపురుషోఽపివా। సహాయం యదివాకుర్యా త్స్వర్గంగచ్ఛతి నిశ్చితమ్ ॥

తా॥ లక్షవర్తివ్రతమునకు సహాయమును జేసిన పురుషుఁడుగాని స్త్రీగాని స్వర్గలోకంబుఁ బొందుచున్నారు. ఇది నిశ్చయము.

శ్లో॥ నారీత తత్ఫలం ప్రాప్య శుభగాభవతి ధ్రువం । నరః పూర్ణ ఫలప్రాప్య విష్ణులోకే మహీయతే ॥

తా॥ స్త్రీయైనట్లయితే యీవ్రతఫలంబును బొంది సువాసినియై యుండి విష్ణుసాయుజ్యమును బొందును. లేక పురుషుడయినట్లయితే విష్ణులోకమునందును సుఖముగా నుండగలడు,

శ్లో॥ యఇదం పుణ్యమాఖ్యానం శృణోతి శ్రద్ధయాన్వితః । తత్ఫలం సమవాప్నోతి విష్ణులోకే మహీయతే ॥

తా॥ శ్రద్ధతో నీపుణ్యప్రదంబయిన కథను విన్న మనుజుడు ప్రసిద్ధఫలమునొంది వైకుంఠమందుఁ బూజింపఁబడుచున్నాఁడు.

ఇతి స్కాందపురాణే ఉమామహేశ్వర సంవాదే
లక్షవర్తి వ్రతకల్ప స్సమాప్తః చ. ల

తర్పణవిధిః .. ఏవంగుణ ....ప్రీత్యర్థం లక్షవర్తివ్రత సంపూర్ణ సకలఫలావాప్త్యర్థం శ్రీలక్ష్మీనారాయణదేవతా....ప్రీత్యర్థం లక్షవర్తి వ్రతోద్యాపనాంగ ప్రతిసాంగతా సిద్ధ్యర్థం యవసహిత క్షీరతర్పణం కరిష్యే । ఇతిసంకల్ప్య॥ బ్రాహ్మణైః కార్యమ్ ॥ [నారాయణగాయత్రీ మంత్రము చేతనే పదివేలమారులు తర్పణముఁ జేయవలెను] ఆదౌ గణపతిమభ్యర్చ్య ॥ ఋత్విగ్వరణం దద్యాత్ । ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి। తన్నోవిష్ణుః ప్రచోదయాత్॥ లక్ష్మీ నారాయణ పరబ్రహ్మణేనమః । ప్రథమార్ఘ్యం సమర్పయామి ॥ ఏవం విధిప్రకారేణ తర్పణంకుర్యాత్ ॥ ధారాదత్తం॥ ....ఏవం ....ప్రీత్యర్థం దశసహస్రక్షీరతర్పణేన భగవాన్........ఏతత్ఫలం శ్రీ లక్ష్మీనారాయణార్పణమస్తు ॥ ఆచరతవ్రత సంపూర్ణ సకలఫలావాప్తిరస్తు ॥

హోమప్రకరణమ్.

ఆచమ్య....ఏవంగుణ....ప్రీత్యర్థం ఆచరితవ్రతస్య వ్రతసంపూర్ణ సకలఫలావాప్త్యర్థం శ్రీ లక్ష్మీనారాయణదేవతాముద్దిశ్య ....ప్రీత్యర్థం బుదాజ్యచరువ్రీహిభిః చతుర్విధహోమం కరిష్యే ॥ తదంగత్వేన లక్ష

వర్తిహోమార్థ మాచార్య బ్రహ్మఋత్విగ్వరణం కరిష్యే ॥ లక్షవర్తి వ్రతహోమార్థ మాచార్యం త్వామహం వృణే । బ్రహ్మాణం త్వామహం వృణే ॥ సమిదాజ్యహోమార్థ మస్మదర్థం భవంతః కుర్వంతు ॥ చరు వ్రీహిభిః హోమార్థ మస్మదర్థం భవంత । కుర్వంతు ॥ వృతోఽస్మి కరిష్యామీతి ప్రతివచనమ్ ॥ తదంగాగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే ॥ అత్రాదౌ శ్వేతతండులచూర్ణేన స్థండిలం చతురశ్రమండలం కల్పయిత్వా ॥ ద్వాభ్యాం దర్భాభ్యా ముల్లిఖ్య ॥ స్థండిలోల్లేఖనాది సర్వం కుర్యాత్ ః అథ ప్రతిష్ఠితాగ్నౌ చరుగ్ శ్రపయిత్వాఽభిఘార్య చరుం నిధాయ । తతో షట్పాత్ర ప్రయోగవిధి ప్రకారేణ కుర్యాత్ ॥ [ఆజ్యహోమః] ఏకం ద్వే - త్రీణి - చత్వారి ॥ [ఇత్యాజ్యం గృహీత్వా] అగ్నయే స్వాహా ॥ ఉత్తరార్ధ పూర్వార్ధే అగ్నయ ఇదం నమమ ॥ ఏకం ...రి ॥ సోమాయ స్వాహా ॥ దక్షిణార్ధ పూర్వార్ధే సోమాయేదం నమమ ॥ తతస్స్రుచ్యుప స్తీర్య ॥ చరు మధ్యాద్ద్విరవదాయాఽభిఘార్య । హవిః ప్రత్యభిఘారయతి । అగ్నయే స్వాహా । అగ్నయ ఇదం నమమ ॥ పునస్స్రుచ్యుప స్తీర్య .... హవిః ప్రత్యభిఘారయతి ॥ ఓం నారాయణాయ విద్మహే.... ప్రచోదయాత్ స్వాహా ॥ శ్రీ విష్ణవే నారాయణాయేదం నమమ.... సక్తుమివ తితఉనా పునంతో యత్ర ధీరా మనసా వాచమక్రత ॥ అత్రా సఖాయస్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి స్వాహా ॥ లక్ష్మ్యా ఇదం ॥ నమమ ॥ [పిమ్మట నారాయణ గాయత్రీ మంత్రముచేత [౧౦౦౦] నూఱులు హోమమును జేయవలెను ] పిమ్మట జయాది హోమమును, అటుపిమ్మట పూర్ణాహుతిని జేయవలెను, ఆమంత్రము లన్నియును యీస్వల్పగ్రంథము నందుఁ జేర్చుటకు వీలులేదు.

ప్రయోగవిధులన్నియుఁ దెలియవలసినయెడల నాచే వ్రాయఁబడిన యాజుషస్మార్తానుక్రమణిక యను యజుర్వేద పూర్వప్రయోగ గ్రంథమునందుఁ జూడవలయును,

———

# స్మార్త గ్రంథములు

యాజుషస్మార్తానుక్రమణిక 4 భాగములు కలది దీనినే యజుర్వేద పూర్వప్రయోగ మందురు. నూతనముగా ముద్రించినాము గ్లేజు ప్రతి సస్వరం ప్రతి 1 కి 60—00

యాజుషస్మార్త మన్త్రపాఠం 1 వ భాగము పాఠకులకు ప్రాముఖ్య మైనది. షోడశకర్మలకు మూలగ్రంథము. సస్వరం ప్రతి 1 కి 55—00

యాజుషస్మార్తమన్త్రపాఠం 2 వ భాగం సస్వరం ఆశీర్వచన ఘన పనసలు. పంచకాటకములు వగైరాలు కలవి సస్వరం ప్రతి 1 కి 50—00

మహాన్యాసాదికము సస్వరం దీనినే రుద్రాభిషేకమందురు. 15—00

నవగ్రహశాంతివిధానం జప. హోమ, తర్పణ, మంత్ర యంత్ర సహితం ప్రతి 1 కి 25—00

ఆపస్తంబ గృహ్యసూత్ర పూర్వప్రయోగ దర్పణం 8—00

తైత్తిరీయ పంచోపనిషత్తులు 8—00

అధికశ్రవణం నాచికేతాంతమువరకు ఘనము సస్వరం 5—50

యజుర్వేద సంధ్యావందనం సస్వర, క్రియ, బ్రహ్మయజ్ఞసహితం 5—50

ఆశీర్వచనదీపిక సస్వరం 5—00

యజుర్వేద వివాహోపనయనములు సస్వరం 12—00

ఆశీర్వచన ఘనపనసలు పెద్దది సస్వరం 25—00

విఘ్నేశ్వర పుణ్యాహవాచనం సస్వరం 5—00

సీతారామకళ్యాణప్రయోగం ప్రతి 1 కి 5—00

విశ్వేశ్వరస్మృతి యతి ధర్మములు కలది ప్రతి 1 కి ఆ॥ 5—00

ఆపస్తంభ గోత్రప్రవరలు 3—50

పురుషసూక్తవిధాన దేవతార్చనం 3—00

కామ్యవృషోత్సర్జనము వృషభ వివాహ ప్రయోగ సహితం వేదోక్తము పురాణోక్తముగలది 3—50

విష్ణూపాసనం 3—50

వలయువారు ఈ క్రింది అడ్రస్సుకు వ్రాసిన పంపగలము.